# సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజి



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస



అమ్మ శారదా దేవి



గురు వివేకానంద



గురు సాయిబాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళ స్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org  Mobile App: Free Gurukul  email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul  Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ ఆఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# వివేకవాణి

## స్వామి వివేకానంద

Acc. No. 5573.




జాగృతి ప్రచురణ

బకింగ్‌హాంపేట : : విజయవాడ - 2.

# శ్రద్ధాంజలి....

ఆధ్యాత్మిక ధర్మ శంఖారావముతో భారతజాతినే కాక యావత్ప్రపంచము ను త్తేజితపరచి ఆధునికయుగంలో నూతన చైతన్యము కల్గించిన హైందవతేజోరాశి స్వామి వివేకానందులు వారు జన్మించి నేటికి (పుష్య బహుళ సప్తమి) నూరు వత్సరములయి. భౌతిక కాయముతో వారు ఈ ప్రపంచమున కానవచ్చింది 39 సంవత్సరముల స్వల్పకాలమే అయినా శతాబ్దముల కొలది జాతి స్మరించుకొనవలసిన దివ్యసందేశము నిచ్చి వెళ్ళిపోయినారు.

ఆత్మ విస్మృతి చెందిన జాతికి ఆత్మసాక్షాత్కారమును ప్రబోధించారు. దేశధర్మముల సమన్వయభావము నెరుగని జనతకు మాతృదేవి దివ్యస్వరూపమును చూపించారు. "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్నిబోధత" నినాదంతో దేశ, ధర్మ రక్షణకు కటిబద్ధం కావల్సిందిగా జాతిని ఉద్బోధించారు.

నేడు దేశమంతటా, ప్రపంచమంతటా వారి శతతమ జయంత్యుత్సవాలు జరుగుతున్నాయి, వారి దివ్యసందేశ మననం జరుగుతోంది. పండితుని మొదలు పామరునివరకు ప్రతివారూ ఆ జ్ఞానమూర్తికి తమ శ్రద్ధాంజలి ఘటిస్తున్నారు. ఈ శుభావసరమున వారికి శ్రద్ధాంజలిపూర్వకంగా "జాగృతి ప్రచురణాలయం" అర్పించుకొను చిన్ని కానుక ఈ చిన్నిపొత్తము, వారు ఆజీవనము ప్రబోధించిన_మాతృదేవి సందర్శనమున. రాష్ట్రాత్మ సాక్షాత్కారావశ్యకత, దేశ, ధర్మ సమన్వయ స్వరూపమైన రాష్ట్రరక్షణాయత్తత_ఇవే ఈ పుస్తక పరిమితులు, స్వామివారి లేఖలు, రచనలు, ప్రసంగములలోని అంశములే ఇందు క్రోడీకరింపబడినవి.

వారి దివ్య సందేశమును స్మరించుకొనుటలో ఈ చిరుకానుక తెలుగు పాఠకలోకమునకు చక్కగా ఉపకరించగలదని ఆశిస్తున్నాం.

ఈ ప్రచురణకై విషయసేకరణలో సహకరించిన శ్రీ ఏకనాథ రావ్ రానడేగారికి, అనువాదములో సహకరించిన శ్రీ భండారు సదాశివ రావుగారికి మా ధన్యవాదములు.

విజయవాడ<br>శుభకృత్ పుష్య బ ౭ } ప్రకాశకులు.

రెండవ కూర్పు :

మొదటి ముద్రణ అయిన వారంరోజులలోనే ప్రతులన్నీ అమ్ముడు పోయినాయి. వెంటనే మరి అనేక ప్రతులు కోరబడ్డాయి. ఆ అవసరాన్ని ఆదుకోడానికి స్వల్ప వ్యవధిలో ముద్రణను నిర్వహించవలసి వచ్చింది. అందువల్ల కవరుకాగితం మున్నగు వానిలో కొన్ని మార్పులు అవలంబించవలసి వచ్చినదని విన్నవించుచున్నాము.

విజయవాడ<br>శుభకృత్ మాఘ శు. ౧. } ప్రకాశకులు.



# ఉద్బోధన

ఇది గుర్తించండి...

హిందూ అనే శబ్దశ్రవణంతో నీలో విద్యుత్తుల్యమగు మహత్తర శక్తి భావం కల్గితేనే నీవు నిజమైన హైందవుడవు;

ఏ దేశానికి చెందినవాడైనా, ఏ భాషకు చెందినవాడైనా- 'హిందువు' అనగానే అతడు నీకు ఆప్తుడూ, ప్రేమపాత్రుడు అయినప్పుడే నీవు నిజమైన హైందవుడవు ;

హిందువు డనే పేరుగల ఎవరు కడగండ్లలో ఉన్నా నీస్వంత కుమారుడే అలా ఉన్నట్లు నీ హృదయం వ్యథ చెందినప్పుడే నీవు నిజమైన హైందవుడవు ;

ఆ గురుగోవిందసింహునివలె హిందువులకోసం సమస్త బాధ్యతను స్వీకరించగలిగినప్పుడే నీవునిజమైనహైందవుడవు. హిందూ ధర్మరక్షణకోసం తన రక్తాన్ని ధారవోసి, రణరంగంలో తన కన్నబిడ్డల సైతం కోల్పోయిన- ఆ మహాకేసరి- తన సర్వస్వాన్ని ఏ హిందూ సమాజానికై ఒడ్డాడో ఆ కృతఘ్న హిందూసమాజంచేతనే త్యజింపబడినప్పుడు, నిశ్శబ్దంగా రంగం నుండి విరమించి, దక్షిణభారతమందు తనువు చాలించాడే గాని - అతని నోటినుండి పల్లెత్తు పరుషవాక్యం రాలేదు!

ఇది మరువకండి !

మీ దేశానికి మీవల్ల ఏదైనా ఉపకారం జరగాలంటే, మీలో ప్రతిఒకరు ఆ గురుగోవిందసింహునివలె కావాలి.

మీ దేశీయులలో వేలాది లోపా లుండవచ్చు, కాని వారి హిందూ రక్తాన్ని గుర్తించండి. వారు మీ హృదయాలను గాయపరచినాసరే, వారిలోని ప్రతియొకరు మిమ్ము నిందించినా సరే- వారే మీ మొదటి ఆరాధ్యదైవాలని మరువకండి.

వారు మిమ్మ గెంటివేస్తే- ఆ మహాకేసరి గురుగోవిందునివలె నిశ్శబ్దంగా నిష్క్రమించండి. అట్టివారే హిందూ అనే పేరుకు అర్హులు. అట్టి ఆదర్శమే సదా మన ముందుండాలి. సంకుచిత భావాలను పాతిపెట్టి సర్వత్రా అనంత ప్రేమను వ్యాపింప జేయాలి.



# మాతృదేవి

ధన్యమైన పుణ్యభూమి అనిపించుకొనే అర్హత ఏభూమి కైనా ఉంటే, కర్మానుభవానికి ఈ ప్రపంచమందలి ఆత్మలు అవతరించవలసిన భూమి అంటూ ఏదైనా ఉంటే;
దైవోన్ముఖమై వెళుతున్న ప్రతిఆత్మకు అంతిమాశ్రయమగు భూమి అనేది ఒకటి ఉంటే;

మహోన్నతమైన సౌజన్యం, ఔదార్యం, పావనత, ప్రశాంతత- అన్నిటికి మించి ఆధ్యాత్మికత, అంతర్వీక్షణాలను మానవాళికి అందిచ్చిన మహత్తరమైన భూమి అనేది ఈవిశ్వంలో ఒకటి ఉంటే, అది భారతభూమి యని గుర్తించండి.

మన పూర్వుల కలలపంట ఈ భూమి. పార్వతీదేవికి కన్నతల్లి. ప్రతియాత్మ భౌతికకాయ విసర్జనకు పూర్వం విడిది చేయాలని ఉబలాటముచెందే పవిత్రభూమి ఇది. ఈ ధన్య భూమి యందలి గిరి శిఖరములలో, గుహాంతరాళాలలో, ప్రచండప్రవాహపుతీరములలో-అత్యద్భుతములైన ఆలోచన లెన్నెన్నో ఉద్భవించాయి. వాటిని లేశమాత్రంగా గ్రహించిన పాశ్చాత్యులను సైతము అవి అబ్బురపరచాయి; అనితరము లనిపించుకున్నాయి.

అన్యదేశాలకు చేరేముందు విజ్ఞానం వికసించిం దీ ప్రాచీనభూమిలోనే. ఆధ్యాత్మిక జ్ఞానవాహినులను ప్రదర్శిస్తున్నవా యన్నట్లున్న మహానదీనదాలు, ఒకదానితో నొకటి పోటీపడుతూ స్వర్గరహస్యముల ఛేదించుటకాయన్నట్లు మహోన్నతంగా నిలచియున్న ఆ చిరంతన హిమవన్నగ శిఖరాలు- ఉన్న దీ భారతదేశములోనే. ఈ భూతలమందు అవతరించిన ఉత్తమోత్తములైన ఋషిపుంగవుల పాదధూళిచే పునీతమైన భూమి ఈ భారతదేశం. మానవ ప్రకృతికి, ఆంతరిక విశ్వానికి సంబంధించిన పరిశోధన లారంభమైన దిక్కడే.

ఇచ్చటనే- ఈమానవాబ్ధినుండే- సుఖదుఃఖ, బలాబల, వైభవదారిద్ర్య, సంతోషదైన్య, జీవనమరణాది ద్వంద్వ భావాల కతీతంగా-శాశ్వత శాంతి ప్రశాంతతలనుండి మహోన్నత వైరాగ్య సింహాసనం ఉద్భవించినది !

మతధర్మాలు ఆచరణయోగ్యంగాను, వాస్తవికంగాను రూపొందిం దీదేశంలోనే. అన్యదేశములలోని స్త్రీ పురుషులు తమ సోదరులైన దీనజనులను దోపిడీచేసి స్వీయసుఖాలను

పొందేందుకు ఎంత వెర్రిగా ఉద్రూతలూగుతారో, అంత తీవ్రంగాను జీవన లక్ష్యాన్ని చేరేందుకు ధైర్యంగా ముందున కురికే స్త్రీ పురుష సమాజముకల దీదేశమే.

ఇచ్చటే - ఇచ్చోటమాత్రమే - మానవహృదయం వికసించి ఒక్క మానవునేకాక, పశు, పక్షి, వృక్ష సంతతు లను - మహోత్తమ దైవములనుండి రజోరేణువులవరకూ, ఉన్నతునీ, అల్పునీ తనలో ఇముడ్చుకొని, విస్తరిల్లి అనంతమై విరాజిల్లినది. సృష్టిని అఖండ సమష్టితత్వంగా- సృష్టిస్పందనే స్వీయస్పందనగా మానవాత్మ పరిగణించిన దిచ్చటే

మన మాతృభూమికి ప్రపంచము అనంతముగా ఋణ పడియున్నది. మన నిరంతర జాతీయాభ్యుదయ తరంగాలు, మహా సత్యసామర్థ్యాల బీజాలు పూర్వమూ, నేడూ ప్రపం చంలో వెదజల్లబడి ఉన్నవి.

అంతకు పూర్వము - నాటి నుండి నేటి వరకును ఈదేశము నుండి భావనా పరంపరలు బైటికి ప్రవహించినవి. అందలి ప్రతిమాటకు వెనుకనున్నదొక శుభాకాంక్ష; ముందు న్నది శాంతిలక్ష్యం. ప్రపంచ జాతులలో దురాక్రమణజాతి కానిది మనజాతి ఒక్కటే. ఆ సౌభాగ్యం మనది. క్షణిక మైన మహాపరాక్రమాన్ని, సార్వభౌమశక్తినీకలిగి, క్రూరాతి క్రూరంగా జీవించి, క్షణంలో నీటిబుడగలవలె నశించిన మహాజాతులు లేకపోలేదు. కాని వందలాది విదేశ దండ యాత్రలను, శతాబ్దముల సంఘాతములను తట్టుకొని నిల్చిన దీ భారతభూమియే. లోకములోని మహాశైలము లన్నింటిని మించిన స్థైర్యంతో, చెక్కుచెదరని స్వత్వముతో, అనశ్వర

చైతన్యంతో నిలచియున్నది దేశమే. ఆద్యంతరహితమైన నిత్యాత్మ ఎట్టిదో అట్టిదే ఈ దేశపు జీవితం. మనం అట్టి మాతృదేవి కన్నబిడ్డలం.

---

# రాష్ట్రాత్మ

ఆర్యజాతితోపాటే ఉద్భవించి, ప్రాచీన భారతీయ కవి ఋష్యాదులచే గానముచేయబడి, దేశకాలముల కతీతమై నిలచియున్న సర్వశక్తిమంతమగు హేతువాదము మన సమాజమున కాధారశిలయై, ఈనాటికిని హైందవజీవన ప్రణాళికయై విరాజిల్లుతున్నది. ప్రారంభంలో జాతిలో జిజ్ఞాస ఉదయించింది. అదే అతి శీఘ్రగతిని నిర్భీకమైన పరిశీలనగా రూపొందింది.

ఈ జిజ్ఞాసువృత్తికి ముందువెనుకల కవచమై వెలుగొందిన గుణం మరొకటి ఉన్నది. ఈజాతి ప్రత్యేకతకది చిహ్నం. అదే కవిసహజమైన అంతరావలోకనం. ఈ ధర్మము, వేదాంతము, చరిత్ర, నీతి, రాజకీయము సర్వమూ ఈ కవిసహజమైన భావనాసుమనశయ్యమీద వికసించాయి.

పరిశీలనాత్మక వృత్తి-కవిసహజ భావనా- ఈ రెండే హైందవజాతి నిర్మాణానికి ఆంతరిక చేతనాశక్తులు. ఈ రెండే జాతి ప్రకృతికి జీవనాడుల్లా రూపొందాయి.

ప్రతి మనిషికీ ఒక వ్యక్తిత్వం ఉన్నట్లే ప్రతి రాష్ట్రానికీ ఒక వ్యక్తిత్వం ఉంటుంది. కొన్ని విషయాలలో, కొన్ని గుణాలలో ఒక మానవుడు మరో మానవునికి భిన్నంగా ఉండేట్లే, ఒక జాతి మరోజాతికి కొన్ని ప్రత్యేక లక్షణాలవలన భిన్నంగా కన్పిస్తుంది. సృష్టిస్వభావంలో ఒక్కొక్క మనిషి ఒక్కొక్క కార్యం సాధించడానికి జన్మించునట్లే; పూర్వ కర్మలనుబట్టి ఒక నిశ్చిత జీవన ప్రణాళికను పొందునట్లే, ప్రతి జాతికీ ఒక లక్ష్యముఉంటుంది; తాను వెలువరించవలసిన ఒక సందేశమూ ఉంటుంది; నెరవేర్చవలసిన బాధ్యతా ఉంటుంది. కనుక మనజాతి కర్తవ్యం మొట్టమొదటే గ్రహించాలి. మన బాధ్యత గుర్తించాలి. మన లక్ష్యాన్ని తెలుసుకోవాలి. విభిన్నజాతుల పురోగమనంలో మన పాత్రను అర్థం చేసుకోవాలి. వివిధజాతుల స్వరమేళనంలో మన మాలాపించవలసిన రాగాన్ని ఆకళించుకోవాలి.

జాతి జీవనం కేంద్రితమైఉండే కేంద్ర బిందువు ఒకటి ప్రతిజాతికీ ఉంటుంది. అక్కడే ఆ జాతియొక్క విశిష్టజాతీయత ఉంటుంది. అది దెబ్బతిననంతవరకూ జాతి నశించదు.

రాజకీయ, సాంఘికస్వేచ్ఛలు మంచివే. కాని వాస్తవమైనది ఆధ్యాత్మిక స్వేచ్ఛ - ముక్తి - ఇదీ హైందవ భావన. ఇదీ మన జాతీయ సంకల్పం. వైదికుడైనా, జైనుడైనా, బౌద్ధుడైనా, అద్వైతిఐనా, విశిష్టాద్వైతిఐనా, ద్వైతిఐనా — ఈ విషయంలో అందరిభావన ఒకటే.

మన శక్తీ, మన బలము - అంతేకాదు - మనజాతీయ జీవనమే ధర్మాన్ని ఆశ్రయించి ఉన్నది. నేటికీ అలాగేఉన్నది.

అలాగే శాశ్వతంగా ఉంటుంది. నాకున్నంత విశ్వాసం మన ధర్మంమీద మీకు లేకపోయినా దాన్ని ఆశ్రయించే మీరు నిల్వొచనక తప్పదు. మీరు ధర్మబద్ధులు. దాన్ని త్యజిస్తే ఛిన్నాభిన్నులై నశిస్తారు. అది మనజాతిజీవనం. దాన్ని మనం బలపరచుకోవాలి. అది మన జాతీయమేధ. అది మన జాతీయ జీవన చైతన్యస్రవంతి. దాన్ని అనుసరిస్తే పరమవైభవాన్నార్జిస్తాం. త్యజిస్తే నశిస్తాం; ఈ జీవనస్రవంతిని విడచిన మరుక్షణంలో మృత్యువే గతి. శూన్యమే మిగిలేది.

రాష్ట్రాత్మ ఎక్కడ ఉన్నదీ ఇప్పుడు తెలిసింది – అది ధర్మంలో ఉన్నది. దానిని ఎవ్వరూ విధ్వంసమొనరించజాలనందుననే హిందూరాష్ట్రం – ఇన్ని ఆఘాతాలను తట్టుకొని – ఇంకా సజీవంగా నిలచిఉన్నది.

ప్రతి జాతికీ ఒక ప్రత్యేక కార్యపద్ధతి ఉంటుంది. మన గమనానికి ధర్మమే మార్గము. హైందవుడు రాజకీయాలనైనా ధర్మంద్వారానైతేనే గ్రహించగలడు. ప్రతిదీ ధర్మంద్వారానే రావాలి. అదీ మూలధార – మిగతావన్నీ జాతీయ చైతన్య సంగీతంలోని వైవిధ్యాలే. ప్రతి హైందవ బాలునిలోనూ జన్మతః ఉద్భవించే ఆధ్యాత్మికతకూ, జాతీయ పునీతత్వానికి, జాతీయమూలధారకు పాశ్చాత్య భౌతిక శాస్త్రవిజ్ఞానాన్ని, విద్యనూ, ధనాన్ని, గౌరవాన్ని, అధికారాన్ని లోబరుచుకొని నడవడంలోనే హైందవ సౌశీల్య రహస్యం ఇమిడిఉన్నది.

మిత్రులారా! మన పూర్వజులైన మహాపురుషులు మనకు బహూకరించిన ఆ ఆధ్యాత్మికతను గట్టిగా అంటిపెట్టుకొని ఉండాలి. అది మన మొదటి కర్తవ్యం.

ప్రపంచంలో సమాజజీవన నిర్మాణానికి రెండు మహా ప్రయత్నాలు జరిగాయి- ఒకటి ధర్మము నాశ్రయించినట్టిది; రెండవది సాంఘికావసరముల నాశ్రయించినట్టిది. మొదటిది ఆధ్యాత్మికత నాశ్రయించినది. రెండవది భౌతికత నాశ్రయించినది.

ఒకవైపు స్వార్థాన్ని ఆశ్రయించిన పశ్చిమ సమాజాల స్వేచ్ఛాప్రవృత్తి, మరోవైపు భారతసమాజపు సంపూర్ణ స్వార్థత్యాగము. పాశ్చాత్యుల లక్ష్యం వ్యక్తి స్వేచ్ఛ, ధనార్జనకోసం అభ్యసించేవిద్యే వారికి భాష; సాధనం రాజకీయాలు. భారతదేశానికి లక్ష్యం ముక్తి, భాష వేదం; సాధనం త్యాగం.

ఒకవైపు ఆధునికభారతం "మీరు పశ్చిమ భావాలను, ఆహార వ్యవహార వేషభాషాదుల నాశ్రయిస్తేనే వారితో తుల తూగే శక్తిసామర్థ్యాలు పొందగలరు" అని ఉద్ఘాటిస్తున్నది.

మరొకవైపు ఆర్షభారతం "మూఢులారా! అనుకరణవల్ల విదేశీభావాలు మన స్వంతభావాలుకాజాలవు.నీస్వార్జితాలు అయితేనేగాని ఏవీ స్వంతం కావు." అని ఉద్బోధిస్తున్నది.

మన స్వభావాన్ని అనుసరించే మనం వికసించాలి. మనలను మలచి,హింసించి ఇతర జాతులరూపంలో పోతపోసేందుకు వీలులేదు. అన్యజాతుల వ్యవస్థలను నేను ఖండించను. వారి కవి మంచివే. మనకు మాత్రం పనికిరావు. ఇతరములైన శాస్త్రములను, సంస్థలను, సాంప్రదాయాలను ఆశ్రయించుకుని వారి ప్రస్తుతవ్యవస్థలు వారికున్నాయి. మనం సహజంగా మన సాంప్రదాయాలను, తరతరాలుగా సంతరించుకున్న కర్మ ననుసరించి మాత్రమే స్వీయమార్గాన పురోగమించగలం.

నూతన పరిస్థితులు భారతదేశ సాంఘిక వ్యవస్థలలో క్రొత్తమార్పులను కోరుతున్నాయి. గడచిన 75 సంవత్సరాలలోను భారతదేశం సంస్కరణ సంఘాలతో, సంస్కర్తలతో నిండి పోతూన్నది. కాని ప్రతిఒక్కరూ విఫలులే ఐనారు. దీనికి కారణం వారికి కీలకం తెలియకపోవడమే. తొందరపాటులో, మన సమాజంలోని దోషాలన్నింటినీ మన మతానికి అంట కట్టారు. పర్యవసానంగా అదేదో కథలో చెప్పినట్లు మిత్రుని ముఖంమీద వ్రాలిన దోమనుచంపే సదుద్దేశంతో అతడి ప్రాణానికే మోసం తెచ్చినట్లయింది.

ఈ సృష్టియంతా లోనుండి వికసించునట్టిదని, ఈ వికాసమంతా అంతకు పూర్వమున్న సూక్ష్మస్థితియొక్క పరిణామముమాత్రమే అనేపాఠము వారికి తెలియదు. ఒకబీజము పరిసర పదార్థముల జీర్ణించుకున్నా, తన ప్రకృతిచేతనే మహా వృక్షమవుతున్నదని వారు గ్రహించలేదు.

జాతి కుటీరములయందున్నది. కాని అచటి జనత శ్రేయస్సుకు ఎవరూ ఏనాడూ ఎట్టి కృషి చేయలేదు. మన ఆధునిక సంస్కరణాభిలాషులకు వితంతువివాహములతో తీరుబడి లేకుండాఉంది. నేను సంస్కరణలకు వ్యతిరేకుడనుకాను; కాని జాతియొక్క వైభవము - వితంతువుల కెందరు భర్తలు లభిస్తారనేదానిమీద కాక - జనసామాన్యపు పరిస్థితిపై ఆధార పడి ఉంటుంది. వారిని మీరుద్ధరించగలరా ? వారి ఆంతరిక ఆధ్యాత్మిక ప్రవృత్తికి ఆఘాతం కల్గించకుండా మీరు వారు కోల్పోయిన వ్యక్తిత్వాన్ని తిరిగి ప్రసాదించగలరా? కృషి, శక్తి, స్వేచ్ఛ, సమానత్వాది విషయాలలో పాశ్చాత్యులలో

కెల్ల పాశ్చాత్యుడవై, ధార్మిక, సాంస్కృతిక విషయాలలో అణువణువునా హైందవుడవుగా భాసించగలవా? ఇది జరిగి తీరాలి. చారిత్రకంగా సంక్రమించిన మన జాతి లక్షణాన్ని నిలుపుకోవాలి.

మన కులాలు, వ్యవస్థలూ మన మతంతో బంధింపబడి ఉన్నట్లు పైకి కన్పించినప్పటికీ, వాస్తవ మది కాదు. మనను ఒకజాతిగా సజీవంగా ఉంచేందుకు ఈవ్యవస్థ లవసరమైనాయి. ఈ స్వాత్మ సంరక్షణావసరం తీరితే అవి సహజంగానే అంతమవుతాయి. నాకు వయస్సు గడుస్తున్నకొద్దీ సార్వకాలిక ప్రశస్తి నందిన ఈవ్యవస్థలపట్ల నా అభిమానం పెరుగుతోంది. ఈ వ్యవస్థల్లో చాలాభాగం నిరుపయోగకరమైనవి, ప్రయోజన రహితమైనవని నే భావించిన రోజులు ఉన్నాయి. కాని అనుభవం పెరిగినకొద్దీ వాటిని తృణీకరించే సాహసం తగ్గుతూన్నది. వానిలో ప్రతి ఒక్కటీ శతాబ్దాల అనుభవాలకు సాక్షాత్ నిదర్శనా లవడమే ఈ సంకోచానికి కారణం.

ఆధ్యాత్మికసంస్కృతీ, వైరాగ్యప్రవృత్తీగల బ్రాహ్మ్యమే మన ఆదర్శం అంటే ప్రాపంచిక భావాలులేని నిత్య సత్య [illegible]ం అపారంగా గల బ్రాహ్మ్యమని నా భావం. హైందవ [illegible]తికి [illegible] అజ్ఞానులు. స్వప్రయోజనాంధులు నైన వారులమాటలు పట్టి దీనిని అర్థంచేసికొన ప్రయత్నించవద్దు. సరియైన, యదార్థమైన వేదాంత దృక్పథంతో గ్రహించు.

కులసమస్యను పరిష్కరించడమంటే ఇప్పటికే ఉన్నతస్థితి [illegible]ఉన్నవారిని క్రిందికి దిగలాగడం కాదు. తెగతిని, త్రాగి, [illegible]ట్టుదప్పి వ్యవహరించడంకాదు. అధిక భోగాసక్తితో హద్దు

మీూరి ప్రవర్తించడం కాదు. వేదాంత మాదేశించిన విధంగా మనలో ప్రతిఒక్కరూ ఆధ్యాత్మికతను పొందడమే, ఆదర్శ ప్రాప్త్యం పొందడమే కులసమస్యకు పరిష్కారమార్గం. ఈ వేదాంత ఆదర్శం మన దేశానికి మాత్రమే కాదు, యావత్ప్రపంచానికి అనువర్తిస్తుంది. పరమేశ్వరుడీ ఆదర్శంలోనే ఉన్నాడు.

ఇతర దేశముల సమస్యలకంటే భారతదేశ సమస్యలు సంక్లిష్టములైనవి, తీక్ష్ణములైనవి. జాతిధర్మం, భాష, ప్రభుత్వం—ఇవన్నీకలిస్తేనే రాష్ట్రమవుతుంది. మనకందరికీ, సమాన భూమిక యీ మన పవిత్ర ధర్మం, సంప్రదాయం. యూరోపులో రాజకీయ భావాలు జాతీయ సమైక్యతకు ఆధారభూతమైనాయి. భారత భవిష్యత్తుకై నేడు ధర్మసమైక్యత ప్రథమావసరం. మన యీ యావద్దేశము ఏకధర్మబద్ధమై ఉండాలి.

మన ధర్మంలో సర్వసంప్రదాయాలకు ఆమోదయోగ్యములైన కొన్ని సూత్రాలున్నాయి. మనం ద్వైతులమైనా, అద్వైతులమైనా, విశిష్టాద్వైతులమైనా, శైవులమైనా వైష్ణవులమైనా, పాశుపతులమైనా - ఏ సంప్రదాయాన్ని అనుసరించినా, మనకు కొన్ని సమాన ధర్మాలున్నవనీ, మన యావన్మంది క్షేమానికీ, మనజాతి మనుగడకూ, పరస్పరం అల్పాల్పములైన విభేదాలను విస్మరించాలనీ పరస్పర కలహాలను మానాలని ప్రతిహిందువుకు బోధింపబడాలి. ఇదే ప్రథమ కర్తవ్యం. దీనిని స్వీకరించాలి.

వికీర్ణమైన ఆధ్యాత్మిక శక్తుల కలయికతో భారతదేశంలో జాతీయసమైక్యత ఏర్పడాలి. భారతజాతి అంటే కేవలం ఒకే ఒక్క ఆధ్యాత్మిక సంగీతానికి లయబద్ధమైయున్న హృదయాల సంఘటనే.

# క్షాత్రగీతము

"క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప!"

గీతాబోధన అసలు ప్రారంభమయ్యేది ఈ విశిష్ఠ శ్లోకంతో.

"అర్జునా! హృదయ దౌర్బల్యాన్ని త్యజించి లే; లేచి పోరాడు" అన్నాడు కృష్ణభగవానుడు. అప్పుడు అర్జునుడు శ్రీకృష్ణునితో వాదించేందుకు ఉత్తమ నైతిక భావాలను ప్రతిపాదిస్తాడు. ఎదిరించడం కంటే విరమించుకోవడం ఎలా ఉత్తమమైనదో వివరిస్తాడు. అలా తన అకర్మణ్యాతను సమర్థించుకోవడానికి ప్రయత్నిస్తాడు. కాని శ్రీకృష్ణుని మోసగించడం సాధ్యమా! శ్రీకృష్ణుడు మహోన్నతాత్ముడు – సాక్షాత్తు పరమేశ్వరుడు. ఆ వాదన ఆంతర్యాన్ని ఇట్టే గుర్తిస్తాడు. అర్జునుని వాదనలోని ఆంతర్యం కేవలం దౌర్బల్యమే.

* * *

శ్రీకృష్ణుడు యుద్ధాన్ని ఆపేందుకు ఎంతో ప్రయత్నించాడు. కాని యుద్ధాన్ని తెచ్చిపెట్టింది ఆ దుర్యోధనుడు. అయితే ఒకసారి దిగినతరువాత వెనుకంజ కూడదు. అదీ క్షత్రియమూర్తి లక్షణం. పారిపోవడం తగదు, అది పిరికితనం. దిగినతరువాత సాధించాలి; ఒక్క అంగుళమైనా చలించతగదు. అన్యాయానికై కాదీ యుద్ధం, ఇది ధర్మయుద్ధం.

ఉన్నదెప్పుడూ (సత్) లేకుండాపోదు. లేనిది (అసత్) ఎప్పుడూ ఉండబోదు. కనుక ఈ సృష్టి సర్వత్రా వ్యాపించిన తత్వం ఆద్యంతములు లేనిది. దానికి చావులేదు. సృష్టిలో ఏదీ నశించదు. ఈ శరీరానికి చావు పుట్టుక లున్నా, ఈ శరీరంలో నివసించేవాడు అనంతుడు; చిరంజీవి. ఇది తెలిసి లే; పోరాడు; వెనక్కు ఒక్క అంగుళం జరుగరాదు – అదే భావన – ఫలితం ఏమైనా, తుదివరకు పోరాడు. నక్షత్రాలు తమ గతిని తప్పనీ, ప్రపంచ మేకమై ఎదిరించనీ. దుస్తుల మార్పు వంటిది మృత్యువు. మరి ఇకనేం? యుద్ధం చేయి. పిరికివై నీవు పొందే దేమిటి? వెనుకంజతో దుర దృష్టాన్ని వదలించుకోలేవు. నీవు అనంతచైతన్యమూర్తివి. బానిసవవడం నీకు తగదు. ఉత్తిష్ఠత. జాగ్రత. లే – నిల్చో – పోరాడు, అవసరమైతే ప్రాణాలర్పించు.

• • •

ప్రపంచంలో పాపమనేది ఏదైనా ఉంటే అది ఒక్క భయమే. నిద్రాణ శక్తులను మేలుకొల్పే పను లొనరించడమే 'పుణ్యం'. మనశ్శరీరాలను బలహీనం చేసే పనులే 'పాపం'. కనుక ఈ దౌర్బల్యాన్ని, భీతిని గెంటివేయి.

నీవు వీరుడివి, నీకిది తగదు.

నాయనలారా! ఈ సందేశాన్ని మీరు ప్రపంచానికి చాటగలరా! అప్పుడే ఈ సమస్తవిషాదము, పాపము, వికారము, మూడు రోజులలో మటుమాయమౌతాయి. దుర్బల భావాలు మచ్చుకైనా కన్పించవు. నేడు–ఈ భయము తరంగాలుగా సర్వత్రా సంచరిస్తున్నది. ఈ తరంగాన్ని త్రిప్పికొట్టండి. దీనికి వ్యతిరేకమైన తరంగాన్ని సృష్టించండి. బల

అద్భుతమైన మార్పునుదర్శించండి. మీరుసర్వశక్తిమంతులు. ఫిరంగుల ముఖంలోకి చొరబడటానికికూడా భయపడకండి.

* * *

ప్రస్తుత పరిస్థితులలో శ్రీకృష్ణుని దివ్యక్రీడలు నీకు ఉపకరించవు. మురళిని మ్రోగించినందున దేశం ఉద్ధరింపబడదు. అద్భుతరాజసిక తేజం ఆపాదమస్తకము తొణికిసలాడే ఒక మహావీరుడు--సత్యాన్వేషణకై తెగించి ప్రాణాలొడ్డగల ధీరుడు, త్యాగమే ధనస్సుగా, విజ్ఞానమే కరవాలంగా కలిగిన వీరుడు - నేడు మనకు ఆదర్శమై నిలవాలి. నేడు కావల్సింది జీవితాన్ని సుఖోద్యానవాటికగా భావించే ప్రేమకలాపికాదు; జీవన సంగ్రామ రంగంలో మహాయోధుడై నిలవగలిగిన వీరుని ఆదర్శం.

* * *

నాయనలారా! కావల్సింది ఇనుపకండలూ, ఉక్కు నరాలు. వజ్రకఠోరమైన మనసు, శక్తి, పౌరుషం, క్షాత్ర వీర్యం-బ్రహ్మతేజం కావాలి.

* * *

నేడు రజోగుణమే మిక్కిలి అవసరం. సాత్వికులని మీరు భావించేవారిలో నూటికి తొంభైమంది గాఢమైన తమస్సులో మునిగియున్నారు. దేశంయావత్తూ గాఢ తమస్సుతో పరిచ్ఛిన్నమైయున్నది. నేడు అనంత రాజసశక్తి మనకు కావాలి. ఈ దేశవాసులకు అన్నవస్త్రాలు లభింపచేయాలి. వారిని మేల్కొల్పాలి; అనంత కార్యపరాయణులుగా చేయాలి. లేనిచో వారు వృక్షములలా, గండశిలల్లా స్తబ్ధులై పోతారు.

* * *

వేదాంతము పాపము నామోదించదు. దోషాన్ని అంగీకరిస్తుంది 'నేను బలహీనుణ్ణి, పాపిని, దురదృష్టవంతుణ్ణి, నాకు శక్తిలేదు, నే నేదీ చేయజాలను' అని భావించడమే మహాదోషమని వేదాంతం ఉద్ఘోషిస్తున్నది.

* * *

బలమే జీవనం, బలహీనతే మరణం. బలమే సుఖం, శాశ్వతజీవనం, అమరత్వం, బలహీనత భరింపరానిది, క్లేశకరమైనది. ఈ క్లేశానికీ, మృత్యువుకూ, దుస్థితికీ భయమే కారణం.

* * *

ధీరులైన వత్సలారా! మీరందరూ మహత్కార్యాలను సాధించడానికి జన్మించామనే విశ్వాసం కలిగిఉండండి. కుక్కపిల్లల అరుపులకు మీరుభయపడరాదు; అంతేకాదు, ఆకాశం నుండి విరిగిపడే పిడుగులకైనా మీరు చలించరాదు.

* * *

ఆత్మద్వేషికై నరకద్వారాలు తెరచుకొని ఉంటాయి. రాష్ట్రాల విషయంలోనూ అంతే. ఆత్మద్వేషం పనికిరాదు; పురోగమనానికి ఆత్మ విశ్వాసం ప్రథమావశ్యకం. తరువాత దైవ విశ్వాసం.

* * *

సోదరులారా! మనం కష్టించి పనిచెయ్యాలి. ఇది నిద్రించతగిన సమయం కాదు: మనపై భవిష్యద్భారతావతరణం ఆధారపడియున్నది. ఆతల్లి మనకై నిరీక్షిస్తున్నది ఆమె ప్రస్తుతం నిద్రిస్తున్నది; అంతే. లేచి, మేల్కొని పునరున్మిషిత జీవనంతో, అపూర్వయశంతో విరాజిల్లేట్లు విజృంభించి మన మాతృదేవిని తన శాశ్వతసింహాసనంపై అధిష్ఠింపజేయుండు.

* * *

విధ్యుక్తకర్మను దేనినీ నిరసించకూడదు. చేసే కర్మను బట్టి కాక, ఆకర్మను చేసే విధానాన్నిబట్టి వ్యక్తులను పరిశీలించాలి. వృత్తికర్మలబట్టి అతికొద్దికాలంలో, అందమైన గట్టిచెప్పులజోడు నిర్మించగల చర్మకారుడు నిత్యజీవనంలో నిరర్థక ప్రసంగాలుచేసే ప్రాధ్యాపకునికంటే ఉత్తముడు. ప్రతి విధ్యుక్త క్రియాపవిత్రమే. ఆ విధ్యుక్తక్రియపై నిష్ఠకలిగి ఉండడమే మహోత్తమమైన ఈశ్వరారాధనాపద్ధతి.

* * *

వినయశీలాన్ని సాధించు. కాని స్వీయవిశ్వాసాన్ని త్యజించకు. అధికులపట్ల వినయంలేనిదే కేంద్రీకరణ సాధ్యం కాదు. వ్యక్తులశక్తులను కేంద్రీకరించనిదే ఏ మహాత్కార్యమూ నెరవేరదు. మీలో ప్రతిఒక్కరూ మహోన్నతుడవక తప్పదు. తప్పదని నేను ప్రకటిస్తున్నాను. వినయం, సంసిద్ధత, ఆదర్శంపట్ల ప్రేమ- ఈమూడూ ఉంటే, నిన్నాపగలిగే శక్తిలేదు.

* * *

[అజ్ఞానము మూర్ఖత్వమూ మనకు తగనివి] ఒకరాజు ఉండేవాడు. పొరుగురాజు మరొకడు తన రాజధానిపై దాడికి వస్తున్నాడని విన్నాడు. దేశాన్ని శత్రువుల బారినుంచి రక్షించడానికి సలహాసంప్రదింపుల కొరకు ఒక మహాసభను ఏర్పాటు చేసి, ప్రజలందరినీ ఆహ్వానించాడు స్థపతులు వచ్చారు. చుట్టూ మట్టికోట, అగడ్త నిర్మించాలని సలహా ఇచ్చారు. వడ్రంగులు దారుదుర్గం నిర్మించమన్నారు. చర్మకారులు తోలుగోడలు కట్టాలన్నారు కమ్మరులు ఆ సలహాలన్నిటినీ కాదని ఇనుపకోటను కట్టాలన్నారు. ఆ

తర్వాత న్యాయవాదులు వచ్చారు. వచ్చి, ఇది చట్టవిరుద్ధ చర్య అనీ, పరుల ఆస్తిని కాజేయడం తగదని వాదించాలనీ అన్నారు. ఇంతలోనే పురోహితులు వచ్చి, అందరినీ అపహాసించి ముందు దైవతృప్తికి బలులివ్వాలి. అప్పుడే మనం అజేయులం కాగలం అన్నారు.

అలా దేశాన్ని రక్షించుకోడం మరచి, పరస్పరం వాదించుకున్నారు, కలహించుకున్నారు. ఈలోగా శత్రువు రానేవచ్చాడు. రాజధానిని ఆక్రమించుకొని విధ్వంసం చేశాడు. [అవసరాన్ని గుర్తించకుండా అజ్ఞానంతోనూ, మూర్ఖంగాను తమ వాదాలను పట్టుకు వ్రేలాడే] మానవుల స్థితి ఇంతే.

* * *

సౌశీల్యం, బుద్ధీ, ఇతరులను సేవించడానికి సమస్తమూ త్యాగం చేయగల సంసిద్ధతా, వినయాదులతో ఈ నా భావాలను సాక్షాత్కరింప చేయడానికి తమ సర్వస్వం సమర్పించగల యువకులమీదే నాఆశలు ఆధారపడి ఉన్నాయి. వారే తమకూ దేశానికీ మేలుచేయగలరు. సాధారణ యువకులు ఎందరో లభించవచ్చు. కాని స్తబ్ధతే వారి లలాటాల మీద వ్రాసి ఉంటోంది. వారిగుండెలలో శక్తిలేదు. నీరస శరీరులు, ధైర్యహీనులు, వీరుచేయగల కార్యం ఏమిటి? నచికేతుని లాంటి విశ్వాసం గల ఒక పది, పన్నెండుమంది యువకులే నాకు లభిస్తే, ఈ దేశంయొక్క ఆశయ సాధనలను నూతన దిశకు మార్చి ప్రవహింప చేయగలను.

---

# ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్యవరాన్నిబోధత!

ఓ! భారతవర్షమా! నీ సతీత్వానికి ఆదర్శం సీత, సావిత్రి, దమయంతి అనేమాట విస్మరించకు. నీవు ఆరాధించే దైవము సర్వసంగపరిత్యాగి, యోగీశ్వరేశ్వరుడునైన ఉమామహేశ్వరుడు- శంకరుడనే మాట విస్మరించకు. నీ వివాహము, ధనమూ, జీవనమూ, నీ విషయసుఖాలకొరకూ వ్యక్తిగతమైన ఆనందంకొరకూ కాదు; నీవు మాతృవేదికపై సమర్పణగా అవతరించావనేమాట విస్మరించకు. అనంత జగన్మాతృత్వానికి నీ సమాజ విధానం ప్రతిబింబమనేమాట విస్మరించకు. నిమ్నులూ, అమాయకులూ, దరిద్రులూ, నిరక్షరులూ, చర్మకారులూ, శుచికాములూ నీ ప్రాణాలకు ప్రాణాలనీ, నీ సోదరులనీ విస్మరించకు. ఓ పరాక్రమశాలీ! ధీరుడివై యుండు. సాహసాన్ని పుంజుకో. హైందవుడవైనందుకు గర్వించు. "నేను హైందవుడను, ప్రతి హిందువూ నా సోదరు"డని సగర్వంగా ప్రకటించు. ప్రతి అమాయిక హైందవుడు, అనాథ హైందవుడు, బ్రాహ్మణుడూ, చండాలుడూ అంతా నా 'సహోదరులే' అని ఉద్ఘాటించు. జీర్ణవస్త్రధారీ!- కటిమాత్ర పరిధానుడా! నీవుకూడా "హైందవుడు నాసోదరుడు, హైందవుడే నాప్రాణం, హైందవదైవతములే నా దైవతములు; హైందవసమాజము నా శైశవడోలిక. నా యౌవ్వనానంద నందనం; వార్థక్యంలో నాపునీత స్వర్గం - నా వారణాసి" అని ఎలుగెత్తిచాటు. సోదరా! "హిందూ భూమియే నా

సర్వోన్నతస్వర్గము, హిందుభూమి శ్రేయమే నా శ్రేయ"మని ప్రకటించు. "ఓ గౌరీ మహేశ్వరా! ఓ జగజ్జననీ! నాకు పౌరుషాన్ని ప్రసాదించు. ఓ సామర్థ్యదాయినీ! నా దౌర్బల్యాన్ని తొలగించు, నా పౌరుష హైన్యాన్ని తొలగించు, నన్ను పూరుషుణ్ణిగా నిర్మించు" అని అహర్నిశలు ధ్యానించు.

* * *

ఆత్మీయులారా! జీసస్ నేడు లేడు. జెహోవాకూడా నేడు లేడు. వారిచటికి రానూరారు. వారందరూ తమ స్వగృహాలను చక్కబెట్టుకోవడంలో నిమగ్నులై ఉన్నారు. మనదేశానికివచ్చే సమయం వారికిలేదు. చిరంతనుడై, స్వస్థుడై అధివసించిఉన్న ఆ శివుడే, ఆ రక్తకాళీకాంబయే, ప్రేమమూర్తి, వేణుగానలోలుడునైన ఆ గోపాలబాలుడే మనకు దిక్కు. ఒకనాడు శివుడే, వృషభాధిపుడై ఢమరుకాధ్వానంతో భారతదేశంనుండి సుమిత్రా, బోర్నియో, సెలిబెస్, ఆస్ట్రేలియా, అమెరికాల్లాంటి దూరదేశాలలో పర్యటించాడు. చిరంతనుడైన ఆశంకరుడే టిబెట్, చైనా, జపాన్, సైబీరియా లాంటి దూరభూములను తన వాహనమైన వృషభేశ్వరునిపాద ఘట్టనలకు పాత్రమొనరించాడు. నేటికీ కాళీమాత చైనా, జపాన్ ప్రజల సేవలందుకుంటున్నది. ఆమెనే క్రైస్తవులు మేరీమాతగా మార్చుకుని, ఏసుప్రభువుకు తల్లిగా పూజిస్తున్నారు. అదిగో హిమాలయం. అటు ఉత్తరాన అదే కైలాసం. చిరంతనుడైన శంకరుని ప్రధానపీఠం. ఆ మహాపీఠాన్ని దశకంఠుడు వింశతిబాహువులతో కదల్చలేకపోయినాడే. ఇక ఈ మిషనరీలా అందుకు ప్రయత్నించేవారు! నే ధన్యుడను. తన ఢమరుక నాదంతో ప్రపంచాన్ని స్పందించివేసే పరమశివుడిచటే

చిరంతనుడై నిత్య సంస్థితుడై ఉంటాడు. పశుబలితో ఆరాధింపబడే మహాకాళి నిత్యసంస్థిత- మురళిగానలోలుడు, ప్రేమ మూర్తిఅయిన ఆ శ్రీకృష్ణుడు నిత్యసంస్థితుడు. వారు హిమవన్నగ ధీరులు. వారిని- క్రైస్తవులేకాదు- మరేమిషనరీలూ- కదల్చజాలరు.

* * *

మనం హిందువులం. నా పితరులనుచూచి నేను సిగ్గుపడను. నా మహాదాదర్శాలలో ఇది ఒకటి. సృష్టిలో నేటి వరకు పుట్టిన పరమాభిమానులలో నేనొకణ్ణి. కాని అది నా ఘనతకాదు, నాపితరుల ఘనత. గతాన్నిగురించి చదివినకొద్దీ, గతంలోకి చొరబడినకొద్దీ నా యీ అభిమానం ద్విగుణిత మవుతూ వచ్చింది. దీనివలన నా విశ్వాసం బలవత్తరమై సాహసోపేతమై నన్ను ధూళినుండి లేపి, మహానుభావులైన మన పూర్వులు ప్రకటించిన జీవనప్రణాళికను సాధించడానికి పురికొల్పింది.

* * *

అనుకరణ నాగరికత కాదు. మనం గ్రహించవలసిన మరో గొప్పపాఠం ఇది. దుర్బలానుకరణ ప్రగతిని సాధించదు. మానవుని అధఃపతనానికి ఇది ప్రబలమైన చిహ్నం. మానవుడే ఆత్మద్వేషి అయిననాడు ఆతుది ఆఘాతం వచ్చిపడ్డట్లే. తన పూర్వులనుచూచి సిగ్గుపడనారంభించిననాడు అతడు సాంతమైనట్లే. ఇతరులనుండి మనం ఎన్నో పాఠాలు నేర్చుకోవచ్చు. మంచి ఎక్కడున్నా గ్రహించు, కాని దానిని గ్రహించి, నీపద్ధతికి అనుగుణంగా జీర్ణించుకో. నీవు మాత్రం అన్యుడివి కావద్దు. నీవు హిందూదేశానికి దూరముకారాదు.

విదేశ భావాలు కొల్లలుగా మనదేశాన్ని ఆక్రమించుకుని మన జీవనాడులను తినివేస్తున్నాయి. మనలో నూటికి తొంబది తొమ్మిదిమంది విదేశభావాలు, అనుభూతులకు నిలయుల మైనాము. ప్రపంచ జాతుల దృష్టిలో మనం ఉత్తమస్థితి నందాలంటే వీటిని దులిపివేయాలి. శరీరం బలహీనంగా ఉన్నప్పుడే రోగక్రిములు శరీరాన్ని నింపివేసి రోగాన్ని సృష్టిస్తాయి. రాష్ట్రాల విషయమూ ఇంతే. రాష్ట్రం బల హీనంగా ఉన్నప్పుడే రాజకీయాలలో, సమాజంలో, విద్యా బౌద్ధిక రంగాలలో వ్యాధి కారకములైన అనేక క్రిములు ప్రవేశించి పలువ్యాధులు జన్మింపచేస్తాయి. దీనిని తొలగించ డానికి, వ్యాధి మూలాన్ని శోధించి రక్తాన్ని సమస్తదోష ములనుండి క్షాళనం చేయాలి.

* * *

మన పూజలలో ప్రప్రథమంగా సేవ్యమైనది మన చుట్టూ వ్యాపించిన విరాట్‌స్వరూపం. దానిని ఆరాధించు. ఈ మానవులూ, పశువులూ అంత మన పరమేశ్వరులే. మన దేశప్రజే మనకు ప్రథమంగా ఆరాధింపదగిన దైవం. త్యాగమూ- సేవ - ఇదే భారత జాతికి ఆదర్శం. వానిని బలపరచండి, తరువాత దాని జాగ్రత అది పడుతుంది.

* * *

నీవు చేసే ప్రతిపనీ స్వాశ్రయమే, స్వప్రయోజనకరమే. ఒక వైద్యశాలనో, అలాంటి మరేదో నిర్మించి పరమేశ్వరుని సేవించాననుకుంటావా ! మనసేవలకై దేవుడు తపిస్తూ పడి లేడు. నీకు సేవావకాశాన్ని ఆయన ప్రతిపాదిస్తున్నాడు. ఈ

మహోవ్యాయామశాలలో నీ కండలబలాన్ని నిర్మించుకునే అవకాశం ఇస్తున్నాడు. అది నీకొరకే - తనకొరకుకాదు. నీసహాయం లేనికారణాన ఒక చీమ ఐనా మరణిస్తుందను కుంటున్నావా? అది ఈశ్వరాపరాధము. పరమేశ్వరునికి సహాయం చేసేందుకుగాక, పరమేశ్వర ప్రాప్తికొరకు పరిశ్రమించే మహదవకాశంలభించిన మనం ధన్యులం. 'సహాయం' అనే మాటను నీ మనసులోనుంచి పెకిలించు. నీవు సహాయం చేయజాలవు. అది దురూహ. ఇది ఆయనను సేవించే అవకాశం పొందడమే. సమస్త ప్రపంచంపట్ల ఇట్టి పూజా ప్రవృత్తి నార్జించు. అప్పుడే నీకు సర్వసంగరాహిత్యం సిద్ధిస్తుంది. ఇదీ నీ కర్తవ్యం. ఇదీ సక్రమ కర్మమార్గం. ఇదే కర్మ యోగం బోధించే రహస్యం.

* * *

కాంక్షలన్నీ విజయపరాజయసూత్రాలను ఆశ్రయించి ఉంటాయి. కాంక్షలు దైన్యాన్ని కల్గించడం తప్పదు. "నేను నిష్కామంగా చేస్తున్నా"నని ప్రకటించడం ఎంతసులభమో, ఆ స్థితిని సాధించడం అంత కష్టం. ఏదో ఒక ఫలాపేక్ష ఉంటుంది. ధనమో, అధికారమో, స్వలాభమో - ఏదో ఒక ఫలాపేక్ష. ఇట్టి ఫలాపేక్షతో శ్రమిస్తే దుఃఖం ప్రాప్తించక తప్పదు. మనోనియమంతో చేసేపనులే మనకు నిస్సంగత్వాన్ని, పరమానందాన్ని లభింపచేస్తాయి. చాలామంది నిష్కామంగా కర్మచేయడం సాధ్యంకాదంటారు. ఏదో ఉన్మాదోద్రేకాలు కలిగిన సమయాల్లోతప్ప నిస్వార్థసేవను ఎన్నడూ చూచిఎరుగనివారే అలాఅనేది. నిష్కామంగా

చేయుడమే శ్రేష్ఠకర్మ. అట్టి కర్మచేయగలిగిననాడే ప్రపంచాన్ని మార్చివేయగల కార్యశక్తిని నిర్మించగల్గుతాడు. అట్టివాడే కర్మయోగానికి మహోన్నతాదర్శస్వరూపుడు.

*   *   *

భారతదేశంలో సామాజిక రాజకీయభావాలను వ్యాప్తి చేసేముందు, ఆధ్యాత్మికాశయములతో ఈభూమిని ముంచెత్తండి. మన ఉపనిషత్తులలో, మన వేదాలలో, మన పురాణాలలో, మతాలలో, అడవులలో, ప్రత్యేక సమాజవర్గాలలో ఒదిగిఉన్న పరమాద్భుతసత్యాలను వెలువరించి దేశములో- ఉత్తరదక్షిణాలలో - ప్రాక్ - పశ్చిమాలలో, సింధునుండి బ్రహ్మపుత్రవరకూ, హిమాలయములనుండి కన్యాకాపీఠం వరకూ - మూలమూలలా - సర్వదిశలా - మహాగ్నిశిఖల్లా విస్తరిల్ల జేయండి.

*   *   *

భారతవర్షమే నశిస్తే ప్రపంచంలో ఆధ్యాత్మికతయే నశిస్తుంది; నైతికసమగ్రత సాంతము నశిస్తుంది. మధురాత్మికమైన ధర్మానుభూతే నశిస్తుంది. ఆదర్శవాదమే నశిస్తుంది. వీనికి బదులుగా కామ, భోగములే స్త్రీ, పురుషదైవములు అవుతాయి ధనమే వీటికి పురోహితుడు, వంచన, బలాత్కారము, వీటికి పూజలు; మానవాత్మయే బలి అవుతాయి. అది జరుగరాదు.

*   *   *

మనకు మహోత్తమాదర్శం ఉండాలి. కాని ప్రజలలో అసంఖ్యాకులు ఆదర్శహీనులై అంధకారమగ్నులై ఉన్నారు.

ఆదర్శం గలవాడు వేయి తప్పులు చేస్తే, ఆదర్శం లేనివాడు యాభై వేలు చేస్తాడు. కనుక ఆదర్శం ఉండడం చాలా అవసరం.

...ఆ ఆదర్శానికై జీవనమర్పిద్దాం. ఇదే మన దృఢ నిశ్చయం. నేను భవిష్యత్తును గురించి ఆలోచించడంలేదు. ఆలోచించ దల్చలేదుకూడా. కాని నాకు కళ్ళముందు స్పష్టంగా కనిపిస్తున్నది మన ప్రాచీన మాతృదేవి మరల మేల్కాంచి, పునరుద్ధరింపబడిన సింహాసనంపై మున్నెన్నడూ లేనంత మహావైభవంలో ఆసీనురాలై ఉన్న దృశ్యం మాత్రమే. శాంతి, శుభకామనా స్వరంతో ఆమెవైభవాన్నే విశ్వమెల్ల మార్మోగించండి.

లేవండి! మేల్కొనండి! లక్ష్యమును సాధించువరకు విశ్రమించకండి.

ఉత్తిష్ఠత ! జాగ్రత ! ప్రాప్యవరాన్నిబోధత !

* * *

మీరు ముత్యపు చిప్పల్లా కావాలి. స్వాతిబిందువు పడడంతో అది వెంటనే మూసుకొని సముద్రగర్భాన్ని చేరి ఆనీటి బిందువు ముత్యంలా ఎదిగేవరకూ ఓపికగా ఉంటుంది. మనమూ అలా ఉండాలి. మొదట వినండి, తరువాత గ్రహించండి, పిమ్మట తొణకకుండా బాహ్య ప్రభావాలు పడకుండా మనస్సును నిగ్రహించుకొని మీలోనున్న సత్పదార్థాన్ని వికసింపచేసుకోడానికి కృషిచేయండి. ఆదర్శంపట్ల ఉన్మాదవృత్తి ఉంటేనే, జ్యోతిని దర్శించగలరు. అక్కడొక ముక్కా, ఇక్కడొకముక్కా సంగ్రహించుకునేవాడు సాధించేదేమీ ఉండదు.

క్షణికమైన సంచలనం కన్పించవచ్చు. కాని అది అంతటి తోనే అంతమవుతుంది.

మీరు హనుమన్మహావీరునే నేడు ఆదర్శంగా గ్రహించాలి. రామాజ్ఞచే అతడెలా సముద్రం లంఘించాడో చూడండి! అతనికి జీవన, మరణభయములేదు. అతడు జితేంద్రియ శ్రేష్ఠుడు, అద్భుత ధీవిశారదుడు. ఈ స్వయంసేవాభావము నాశ్రయించి మీ జీవితాలను నిర్మించుకోవాలి. ఆ తరువాత ఇతరాదర్శాలన్నీ అవతరిస్తాయి. సంశయ హితమైన గురుభక్తి, తీవ్రబ్రహ్మచర్యానుష్ఠానము-ఇదే జీవన విజయ రహస్యము. హనుమంతుడు సేవాతత్వానికి ఆదర్శమూర్తియే కాదు; ప్రపంచాన్ని దిగ్భ్రాంత మొనర్చగల పరమ సాహసానికి ప్రతీకంకూడా. రామసేవలో తన ప్రాణాలనైనా నిస్సంశయంగా సమర్పించగల సాహసం; ఇతరవిషయాలన్నిటి పట్లా-తుదకు బ్రహ్మత్వప్రాప్తి, శివత్వసిద్ధిపట్లకూడా ఔదాసీన్యం. రాముని ఆజ్ఞాపాలనమే జీవనప్రతిజ్ఞ. అట్టి సంపూర్ణ శ్రద్ధ నేడు కావాలి.

* * *

ప్రతి విధ్యుక్తకర్మయూ పవిత్రమే. విధ్యుక్తకర్మ పట్ల శ్రద్ధకల్గి ఉండడమే పరమేశ్వరునారాధించే ఉత్తమ మార్గం. మనకు సన్నిహితంగా మన చేతుల్లోఉన్న మన విధ్యుక్తధర్మాన్ని ఆచరిస్తే మనకు శక్తిలభిస్తుంది. ఇలా క్రమంగా మన శక్తిని పెంచుకుంటూపోయిన పక్షంలో జీవనంలో, సమాజంలో పరమోన్నత విధులను నెరవేర్చే మహదవకాశం లభించే స్థాయి మనకు లభించవచ్చు.

మన ఉపనిషత్తులు శ్రేష్ఠమైనవే. మన పూర్వులు శ్రేష్ఠులే. కాని మనం నేడు బలహీనులం, అతి బలహీనులం. మొదటిది: మన దైన్యాలన్నిటికీ మూలహేతువైనది- శారీరక దౌర్బల్యం. మనం సోమరులం, అసమర్థులం. మన యువకులు బలశాలురై యుండాలి- ఇది ప్రథమావసరం. ఆ తర్వాత ధర్మాన్ని గురించి ఆలోచించవచ్చు. మరి కొంచెం దృఢమైన దండలూ కండలూఉంటే గీతాశాస్త్రాన్ని మరింత చక్కగా గ్రహించగలవు. మరింత బలకరమైన రక్తంతో శ్రీకృష్ణుని మహా ప్రతిభను, మహాబలాన్ని మరింత చక్కగా గ్రహించ గలవు.

* * *

మన గ్రంథాలలో నిండియున్న ఆధ్యాత్మికతా మణులను వెలికితెచ్చి, వానిని వ్యాపింపచేయాలని నా సంకల్పం.

ఉపనిషత్తులే మనకు ప్రమాణగ్రంథాలు. భారతదేశములో ఏ సంప్రదాయానికి చెందినా, ఏ సిద్ధాంతాన్ని చేబట్టినా, ప్రమాణం కొరకు ఉపనిషత్తులనే ఆశ్రయించాలి. దాని నంగీకరించనిచో అది విధర్మియతే.

జైన, బౌద్ధ, తత్వగ్రంథాలు కూడా శ్రుతిసహాయ్యాన్ని కాదనలేదు. బలము- బలము- ఇదే ఉపనిషత్తుల ప్రతిపుటా నాకుపదేశించేది. మన జాతిని బలహీనపరచడానికి కారణమైన ఎన్నో విషయాలు మనమీ గత వేయి సంవత్సరాలలో అనుభవించాం. నేడు మనకు కావలసింది బలము- బలము- ముమ్మాటికీ బలమే. ఈ బలానికి ఉపనిషత్తులు మూలరాసులు. సమస్తప్రపంచాన్ని క్రియమాణమొనర్చగల

శక్తి ఉపనిషత్తుల్లో వున్నది. వానితో ప్రపంచాన్ని ఉద్రూతలూగించవచ్చు, శక్తిమంతమొనర్చవచ్చు, ఉత్తేజితమొనరించవచ్చు. స్వేచ్ఛ - శారీరక స్వేచ్ఛ, మానసిక స్వేచ్ఛ, ఆధ్యాత్మిక స్వేచ్ఛ - ఇవే ఉపనిష దుద్ఘోషలు.

* * *

దక్షిణసముద్ర ద్వీపాలలో తుఫానుకు గురియైన కొన్ని ఓడల ఉదంతాన్ని, వాటి చిత్రాలనూ "లండన్ న్యూస్" అనే పత్రికలో ఒకసారి నేను చూచాను. ఒక్క ఆంగ్ల నౌక తప్ప మిగతా నౌకలన్నీ భగ్నమైనాయి. ఆ ఒక్కటే తుఫానులో నిలవగలిగింది. భగ్ననౌకలమీద మునిగిపోవడానికి సిద్ధంగాఉన్న జనం బ్రతికి బైటపడిపోతున్న వారిని అభినందించే దృశ్యం ఆ చిత్రాలలో ఉన్నది. అట్టి స్థైర్యాన్ని, ఉదారతను అలవరచుకోండి మీతోపాటు మిగతా వారిని దిగలాగ జూడకండి.

* * *

ఆలోచనలే క్రియాశక్తికి మూలం. మనస్సును ఉన్నత భావాలతో నింపండి. ప్రతినిత్యమూ ఉత్తమ భావాలువినండి. నెలలతరబడిగా వాటినే మననం చేయండి. అపజయాలను లెక్కించకండి. అవి సహజాలే. జీవితానికి అవి అందాన్ని చేకూరుస్తాయి. ఆదర్శాన్ని నిరంతరం ఉన్నతంగా ఉంచుకోండి. వేయిమారు లోడినా తిరిగి ప్రయత్నించండి.

* * *

భారత సైనికుడు యుద్ధరంగంలో పిరికితనం ప్రదర్శించడం ఎన్నడైనా ఎరుగుదువా? ఎన్నడూ లేదు. కాని వారికి నాయకులు కావాలి. "ముఖ్యుడు తన శిరస్సు నర్పించ

సిద్ధంకావాలి". నీ జీవితాన్ని ఒక మహత్తరాదర్శం కొరకు సమర్పించగల నాడే నీవు నాయకుడివి కాగలవు. కాని త్యాగం చేయకే నాయకులు కావాలని మనం చూస్తుంటాం. ఫలితమో ? శూన్యం. మన మాట వినేదెవడు ?

* * *

ప్రగాఢ విశ్వాసంతో దేశ హితానికై సర్వస్వార్పణం చేయగల పురుషులున్నప్పుడే, అట్టివారు ఉద్భవించినప్పుడే సర్వతోముఖ భారత సౌభాగ్యం సిద్ధిస్తుంది. దేశాలను నిర్మించేది ఇట్టి వ్యక్తిత్వాలే.

* * *

ఇది ఉపన్యాసాలకు కాలంకాదు. నేటి మన విద్యార్థికులు అట్టి ఉపన్యాసాలు విని, కరతాళధ్వనులు చేస్తూ "మేలు-మేల"ని పొగడడం తప్ప మరేమీ చేయజాలరు. ప్రజలకు సజీవము, ప్రదీప్తమూనైన ఆదర్శాన్ని చూపనిదే మన దేశానికి లాభంలేదు. దేశహితార్థమై తమ జీవితాలను అర్పించగల, సర్వత్యాగాలు చేయగల యువకులు మనకు నేడుకావాలి. ప్రప్రథమంగా వారి జీవనాలను నిర్మించాలి. అప్పుడే నిజమైన కృతి ఆరంభమవుతుంది.

* * *

సాధ్య, సాధనాలపట్ల సమానశ్రద్ధ చూపడమే విజయానికి కీలకం. మామూలుగా అపజయాలు లభించడానికి కారణాలు శోధించండి. తొంబది తొమ్మిది సందర్భాలలో సాధనాలపట్ల అశ్రద్ధచూపడమే కారణం అని ఋజువవుతుంది. నేడు మనం సాధనాలను సమీచీనంగా సమర్థంగా నిర్మించుకోవాలి. సక్రమ సాధనాలుంటే సిద్ధితప్పదు. కారణాల పట్ల

శ్రద్ధవహిస్తే కార్యం నెరవేరక తప్పదు; లక్ష్య ప్రాప్తియే మన కార్యం; దీనికి కారణం సాధనాలు - వానిపట్ల శ్రద్ధ వహించాలి. ఇదే విజయ రహస్యం.

* * *

నేడు మీరుపొందుతూన్న విద్యలో కొంత మంచి ఉన్నది. కాని దానివలన మూడే కీడు క్రింద ఆమంచి అణగి పోతూన్నది. మనదేశంలో మహాపురుషులంటూ జన్మించారనే మనకు బోధించరు. సార్థకమైన దేదీ మనకు బోధింపబడదు. మన కాళ్లుసేతుల ఉపయోగం కూడా మనకు తెలియదు. ఆంగ్లేయుల పూర్వజుల వివరాల నన్నిటినీ మనం కంఠోపాఠం చేస్తాం. కాని మన పూర్వులను గురించి ఔదాసీన్యం కనబరుస్తాం. మనం నేర్చుకున్నదల్లా దౌర్బల్యమే.

విద్యఅంటే విషయబాహుళ్యాన్ని మెదడుకు పట్టించడం కాదు; జీర్ణంకాక కల్లోలం సృష్టించే సామగ్రికాదు. ఉజ్జీవన కరం, మానవ నిర్మాణకారకం, శీలనిర్మాణ సమర్థములైన భావములను జీర్ణించుకోగలిగినదే విద్య. కనుక వ్యావహారికమే కానీ, ఆధ్యాత్మికమే కానీ - మనదేశపు విద్యావిధానమంతా మన అధీనంలో ఉండాలి. అదీ జాతీయ పద్ధతిలో ఆచరణయుక్తమైనంతవరకూ జాతీయ విధానంద్వారా జరగాలి.

* * *

మనదేశపు వ్యావహారిక, ఆధ్యాత్మికవిద్యలమీద మన అధికారం ఉండాలి. స్వప్నాలలో, సంభాషణలో, ఆలోచనలో దాన్ని గురించే మననం చేసుకోవాలి దానిని సాధించాలి. అంతవరకూ మనజాతికి విముక్తిలేదు. దీనికో వ్యవస్థ అవసరం. ఎలాంటిది? ఉదాహరణకు, మనకో

మందిరం కావాలి. అది వర్గాతీతంగా ఉండాలి. అందులో అన్ని సంప్రదాయాలకూ మహోత్తమ చిహ్నమైన "ఓం" ఒక్కటే ప్రతిష్ఠింప బడాలి. తమ మతాన్ని ఏ సంప్రదాయానికి చెందినవారు, ఆ సాంప్రదాయా న్ననుసరించి నిర్వచించ వచ్చు. మందిరం మాత్రం ఒక్కటే ఉండాలి. ఇక్కడ విభిన్న సంప్రదాయాలలోని సమాన ధర్మాలు బోధింపబడాలి. దానితో ఏ సంప్రదాయాన్ని అనుసరించే వాడైనా అక్కడ తన విధానాన్ని బోధించవచ్చు. ఒక్కటే నియమం : పరస్పరం కలహించుకోరాదు.

ఈ మందిరానికి అనుబంధంగా, ధర్మాన్నీ, వ్యావహారిక విద్యనూ - రెంటినీ మన ప్రజలకు బోధించడానికి అధ్యాపకులకు శిక్షణ నిచ్చే ఒక సంస్థ ఉండాలి. ఆ అధ్యాపకులు రెండిటినీ ప్రబోధించాలి. పరస్పర సహకారాన్నీ, పరస్పర సానుభూతినీ హిందువులకు నేర్పే ఒక సంస్థ చాలా అవసరం. జాతి స్వభావమంతా శిశుస్వభావానికి వలె పరాధీనంగా తయారైంది. నోటివద్దకు ముద్దతెస్తే తింటారు. కొందరికి లోనికి కూడా త్రోయాలి... మీకు మీరు సహాయం చేసుకోలేకపోతే జీవించే అర్హత కూడా ఉండదు. నేడు భారత దేశంలో నలుగురు కలసి నాల్గు ఘడియలపాటు ఏపనీ చేయలేరు. అట్టి దేశంలో ఎన్ని భేదాలున్నా పరస్పరం దుర్భేద్యమైన ప్రేమ పాశంతో బంధింపబడిన ఒక యువక సంఘాన్ని నిర్మించాలి! ఇదెంత అద్భుతమైన విషయం! ఈ సంఘం వికసిస్తుంది. ఈ మహోద్భుతౌదార్యం శాశ్వత శక్తి, పురోగతినీ పెనవేసుకొని భారత దేశమంతటా వ్యాపించాలి, విద్యుత్తులా జలదరింప చేయాలి. ఎంత అజ్ఞానం,

విద్వేషం, కుల కక్షలూ, మూఢాచారాలూ, ఈర్ష్యా ఉన్నా ఈ ప్రేమభావం సమాజంలో నరనరాలలో వ్యాపించాలి.

* * *

నీవు నిజమైన సంస్కర్తవు కావాలంటే మూడు విషయాలు అవసరం.

మొదటిది అనుభూతి.

మొదట మనసా అనుభూతి పొందు. పరమేశ్వరుని చూడడానికి మార్గం హృదయమేకాని బుద్ధికాదు. బుద్ధి సంశోధనకారిమాత్రమే. విద్యుత్తుకంటే, మరే ఇతర విషయం కంటేనూ మహోద్ధృత వేగంగా కదలాడేది, పనిచేసేదీ హృదయమే. బుద్ధికూడా అవసరమే. అది లోపిస్తే దారుణ దోషాలు, తీవ్రమైన తప్పిదాలు చేస్తాము. బుద్ధి వీటిని నిరోధిస్తుంది. అంతే. ఆపైన బుద్ధిబలంద్వారా ఏదో సాధించాలని ప్రయత్నించకు. ప్రేమ దుర్గమద్వారాలను సహితం భేధిస్తుంది. సృష్టిరహస్యాలకు ప్రేమే పరమమార్గం. కనుక హృదయానుభూతి అవసరం.

నీకు సానుభూతి కలదా! అది మొదటిమెట్టు. తర్వాత ఉపాయం అన్వేషించావా? అయితే అది రెండో మెట్టు. మరొకటి ఉన్నది. ఇందులో నీ ఉద్దేశ్యం ఏమిటి? కీర్తి అధికారం, ధనం నిన్ను పురిగొల్పడంలేదు కదా!

ఉత్తుంగ శృంగాలలాంటి బాధల తరించగల మయం నీకు ఉన్నదా? సమస్త ప్రపంచం కత్తిపత్తి.ని చినా నీ విశ్వాసాలకై ప్రయత్నించగల సాహసం ఉ

ఈ త్రిగుణాలూ ఉంటే మీలో ప్రతిఒక్కరూ ద్భుతాలను సాధించగలరు.

* * *

మన సమాజానికి నేతృత్వం వహించింది రాజులూ కాదు, సేనాపతులూ కాదు; ఋషులు. ఎవరీఋషులు ? వారు సామాన్యమానవులు కాదు. ఉపనిషత్తులలో చెప్పబడ్డట్లు వారు మంత్రద్రష్టలు. ధర్మసాక్షాత్కారం పొందిన మహనీయులువారు. ధర్మమనేది వారికి గ్రంథవిజ్ఞానం కాదు; వాదనా విషయమూ కాదు; ఊహాలోక విహారమూ కాదు; ఉపన్యాసప్రవాహ మసలేకాదు. వారి కది వాస్తవసాక్షాత్కారము; ఇంద్రియముల కతీతమైన సత్యముల ప్రత్యక్షదర్శనము. ఇదీ ఋషిత్వము. ఇది దేశ కాలములకు, వర్గ వర్ణములకు అతీతమైనట్టిది. సత్యమును సందర్శించి తీరాలంటాడు వాత్సాయనుడు—మీరూ, నేనూ, ప్రతిఒక్కరు అట్టి సత్యసందర్శనము చేసి తీరాలి. మనకు అట్టి ఆత్మవిశ్వాసముండాలి. మనలో సర్వశక్తి ఉన్నది. అందువల్ల మనమీ ప్రపంచాన్ని కదలించి వేయగలగాలి.

ధర్మాన్ని ప్రత్యక్షంగా దర్శించాలి, అనుభూతి పొంది తద్వారా సర్వసంశయములను విచ్ఛిన్నము చేసుకోవాలి. అట్టి ఋషిత్వ పకాశమందు నిలచిన మనము మహాశక్తిమంతులముగా భాసిస్తాం; మనపెదవులనుండి వెలువడే ప్రతిపలుకూ అనంతశక్తిమంత మవుతుంది; మనము శపించకుండానే, మనము నిందించకుండానే, మనము పోరాడకుండానే సమస్త దౌష్ట్యములు నశించిపోతాయి. మనఃముక్తికి, అన్యుల విముక్తికి గాను అట్టి ఋషిత్వమును సాధించుటలో భగవానుడు మనకు సహాయపడుగాక !

---